చలనా త్పర్వతేంద్రస్య గణా దేవాశ్చ కంపితాః
చచాల పార్వతీ చాపి తదా శ్లిష్టా మహేశ్వరం॥ 22
దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదన భాజనం
సర్వమేవావిభక్తం నో భవిష్యతి హరీశ్వర॥ 23
యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్
తామేవరాత్రిం సీతాఽపి ప్రసూతా దారకద్వయం॥24
ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీబీజసంయుతం
త్రిసంధ్యం యః పఠేన్నిత్యం సర్వపాపైః
పరిముచ్యతే॥ 25

## అష్టాదశశ్లోకీ భగవద్గీత

[క్రింది శ్లోకములు నిత్యము పారాయణ మొనరించిన
గీతా హృదయము అవగతమగును.]

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ
న చ రాజ్యం సుఖాని చ
కిం నో రాజ్యేన గోవింద
కిం భోగై ర్జీవితేన వా ॥ 1

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతో ఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ 2

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో, గుణకర్మ విభాగయోః
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥ 3

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవి
ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం।
బ్రహ్మైవ తేన గంతవ్యం
బ్రహ్మకర్మ సమాధినా॥ 4

శ్లో॥ విద్యావినయసంపన్నే। బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ। పండితాః సమదర్శినః॥ 5

శ్లో॥ శనై శ్శనై రుపరమేత్। బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా। న కించి దపి
చింతయేత్॥ 6

శ్లో॥ భూమి రాపోఽనలో వాయుః। ఖం మనో బుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే। భిన్నా ప్రకృతి రష్టధా॥ 7

శ్లో॥ ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్ మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్దేహం
స యాతి పరమాం గతిం॥ 8

శ్లో॥ అనన్యా శ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహం॥ 9

శ్లో॥ అథవా బహునైతేన
కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహ మిదం కృత్స్న
మేకాంశేన స్థితో జగత్॥ 10

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో। మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు। యస్సమామేతి పాండవ॥11

శ్లో॥ అనపేక్ష శ్శుచి ర్దక్ష। ఉదాసీనో గతవ్యథః
సర్వారంభపరిత్యాగీ।యో మద్భక్త స్సమే ప్రియః॥12

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా। దాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే। తథాఽఽత్మా నోపలిప్యతే॥ 13

శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తిం చ
మోహ మేవంచ పాణ్డవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని
న నివృత్తాని కాంక్షతి ॥ 14

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా
ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః
పచా మ్యన్నం చతుర్విధమ్ ॥ 15

శ్లో॥ య శ్శాస్త్రవిధి ముత్సృజ్య
వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి
న సుఖం చ పరాం గతిం ॥ 16

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం
సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే ॥ 17

శ్లో॥ సర్వ ధర్మా న్పరిత్యజ్య
మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచ ॥ 18

# శ్రీరామరక్షా స్తోత్ర రత్నమ్

ఈశ్వర ఉవాచ !

శ్రీరామ రామ రఘునందన రామ రామ
శ్రీరామ రామ భరతాగ్రజ రామ రామ
శ్రీరామ రామ రణకర్కశ రామ రామ
శ్రీరామ రామ శరణం భవ రామ రామ
రామ రామ తవ పాద పంకజం
చింతయామి భవబంధముక్తయే
వందితం నరసురేంద్రమౌళిభిః
ధ్యాయితం మనసి యోగిభిః సదా ॥
లోకాభిరామం రణరంగధీరం
రాజీవనేత్రం రఘువంశనాథం
కారుణ్యపాత్రం కరుణాకరం తం
శ్రీరామచంద్రం శరణం ప్రపద్యే ॥
శిరో మే రాఘవః పాతు
ఫాలం దశరథాత్మజః
కౌసలేయో దృశౌ పాతు
విశ్వామిత్ర ప్రియః శ్రుతీ ॥

ఘ్రాణం పాతు మఖత్రాతా
ముఖం సౌమిత్రివత్సలః
జిహ్వాం విద్యానిధిః పాతు
కంఠం భరత వందితః ॥ 2

స్కంధౌ దివ్యాయుధః పాతు
భుజౌ భగ్నేశకార్ముకః
కరౌ సీతాపతిః పాతు
హృదయం జామదగ్న్యజిత్ 3

పార్శ్వే రఘువరః పాతు
కుక్షీ మిక్ష్వాకునందనః
మధ్యం పాతు ఖరధ్వంసీ
నాభిం జాంబవదాశ్రయః 4

సుగ్రీవేశః కటిం పాతు
సక్థినీ హనుమత్ప్రభుః
ఊరూ రఘూత్తమః పాతు
గుహ్యం రక్షఃకులాంతకృత్ 5

జానునీ సేతుకృత్ పాతు
జంఘే దశముఖాంతకః
పాదౌ విభీషణ శ్రీదః
పాతు రామోఽఖిలం వపుః 6

రామరక్షాం పఠేత్ ప్రాజ్ఞః
పాపఘ్నీం సర్వ కామదాం

యస్యాః పఠన మాత్రేణ
సర్వారిష్టనివారణమ్ 7

వజ్ర పంజర నామేదం
యో రామకవచం పఠేత్
శ్రీరామ రక్షణా ద్భక్తో
లభతే జయమంగళం ॥ ౮

మాతా రామో మత్పితా రామచంద్రః
స్వామీ రామో మత్సఖా రాఘవేశః
సర్వస్వం మే రామచంద్రో దయాళుః
నాన్యం దేవం నైవ జానే న జానే ॥ ౯

సంసార సాగరసముత్తరణైక మంత్రం
బ్రహ్మాదియోగి మునిపూజిత సిద్ధ మంత్రం
దారిద్ర్య దుఃఖభవరోగ వినాశమంత్రం
వందే మహాభయహరం రఘునాథ మంత్రం

"శ్రీరామరక్షా సంపూర్ణం"

## శివపంచాక్షరి

శ్లో॥ నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మై నకారాయ నమశ్శివాయ ॥

శ్లో॥ మందాకినీ సలిల చందన చర్చితాయ
నందీశ్వర ప్రమదనాథ మహేశ్వరాయ
మందార ముఖ్యబహుపుష్పసుపూజితాయ
తస్మై మ కారాయ నమశ్శివాయ ॥

శ్లో॥ శివాయ గౌరీవదనారవిందాయ
సూర్యాయ దక్షాధ్వరనాశవాయ
శ్రీనీలకంఠాయ వృషభధ్వజాయ
తస్మై శి కారాయ నమశ్శివాయ ॥

శ్లో॥ వశిష్ఠకుంభోద్భవగౌతమాది
మునీంద్రదేవార్చిత శేఖరాయ
చంద్రార్కవైశ్వానరలోచనాయ
తస్మై వ కారాయ నమశ్శివాయ ॥

శ్లో॥ యక్షస్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ
దివ్యాయ దేవాయ దిగంబరాయ
తస్మై య కారాయ నమశ్శివాయ ॥
పంచాక్షర మిదం పుణ్యం యః పఠే చ్ఛివసన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే ॥

శ్రీ గోస్వామి తులసీదాస కృత

## శ్రీ హనుమాన్ చాలీసా

శ్రీ గురుచరణ సరోజరజ, నిజమన ముకుర సుధారి ।
వరణౌ రఘువర విమలయశ జో దాయక ఫలచారి ॥

బుద్ధిహీన తను జానకై సుమిరౌ పవనకుమార్ ।
బల బుద్ధి విద్యా దేహు మొహి హరహు కలేశ వికార్ ॥

1. జయ హనుమాన జ్ఞానగుణసాగర
జయ కపీశ తిహులోక వుజాగర
2. రామదూత అతులిత బలధామా ।
అంజనిపుత్ర పవన సుతనామా
3. మహావీర విక్రమ భజరంగీ
కుమతి నివార సుమతి కేసంగీ
4 కంచన వరణ విరాజ సువేశా,
కాననకుండల కుంచితకేశా
5. హాథవజ్ర ఔరుధ్వజా విరాజై,
కాంధేమూంజ జనేవూ ఛాజై
6. శంకర సువన కేశరీనందన,
తేజప్రతాప మహా జగవందన
7. విద్యావానగుణీ అతి చాతుర,
రామ కాజ కరివేకో ఆతుర
8. ప్రభు చరిత్ర సునివేకో రసియా
రామలఖన సీతామనబసియా
9. సూక్ష్మరూపధరి సియహి దిఖావా,
వికటరూపధరి లంక జరావా
11. భీమరూపధరి అసురసంహారే,
రామచంద్రకే కాజసవారే

11. లాయస జీవన లఖిన జియాయే.
శ్రీ రఘువీర హరషి వురలాయే.

12. రఘుపతి కీన్హి బహుతబడాయీ,
కహా( భరత సమ ప్రియభాయీ

13. సహస వదన తుమ్హరో యశగావై(,
ఆసకహి శ్రీపతి కంఠలగావై(,

14. సనకాదిక బ్రిహ్మాది మునీశా,
నారద శారద సహిత అహీశా

15. యమ కుబేర దిగపాల జహాఁతే,
కవికోవిద కహిసకై కహాఁతే

16. తుమ వుపకార సుగ్రీవహి కీన్హా.
రామమిలాయ రాజపద దీన్హా

17. తుమ్హరో మంత్రి విభీషణమానా,
లంకేశ్వర భయే సబజగజానా

18 యుగ సహస్ర యోజన పర భానూ,.
లీల్యో తాహి మధురఫలజానూ

19. ప్రిభుముద్రికా మేలిముఖమాహీ(,
జలధిలాంఘిగయే అచరజనాహీ

20. దుర్గమకాజ జగతకేజేతే,
సుగమ అనుగ్రహ తుమ్హరేతేతే.

21. రామదుఆరే తుమరఖవారే,
హోతన ఆజ్ఞా బినుపైశారే

22. సబసుఖలహై తుమ్హారీశరనా,
తుమరక్షక కాహూకోడరనా

23. ఆపనతేజ సమ్హారో ఆపై
తీనో లోక హాంకతేకాంపై

24. భూతపిశాచ నికటనహి ఆవై,
మహావీర జబనామసునావై

25. నాసై రోగ హరై సబపీరా
జపత నిరంతర హనుమతవీరా

26. సంకట సే హనుమతవీరా
మనక్రమ వచన ధ్యానజోలావై

27. సబపర రామురాయ సిర తాజా,
తినకే కాజ సకల తుమ సాజా

28. ఔర మనోరథ జో కోయీలావై,
తాసు అమిత జీవనఫలపావై

29. చారో యుగ పరతాపతుమ్హారా,
హై పరసిద్ధి జగతఉజియారా

30. సాధుసంతకే తుమరఖవారే,
అసురనికందన రామదులారే

31. అష్టసిద్ధి నవనిధికే దాతా,
అసవరదీన్హ జానకీమాతా

32. రామరసాయన తుమ్హారేపాసా,
సాదర తుమ రఘుపతికేదాసా

33. తుమ్హరే భజన రామకోభావై
జన్మజన్మకే దుఃఖబిసరావై
34. అంతకాల రఘుపతిపురజాయీ,
జహాఁజన్మి హరిభక్త కహాయీ
35. ఔర దేవతా చిత్తన ధరయీ,
హనుమత సేయి సర్వసుఖకరయీ
36 సంకట హటై మిటై సబపీరా,
జో సుమిరై హనుమత బలవీరా
37. జై జై జై హనుమాన గోసాయీ,
కృపాకరో గురుదేవకీనాయీ
38. యహ శతవార పాఠకర జోయీ,
ఛూటహి బంది మహాసుఖహోయీ
39 జో యహపఢై హనుమాన చాలీసా,
హోయసిద్ధి సాఖీ గౌరీసా
40. తులసీదాస సదా హరిచేరా,
కీజై నాథ హృదయమహడేరా

పవన తనయ సంకట హరన మంగల మూరతిరూప్ ।
రామ లఖన సీతాసహిత హృదయ బసహు సురభూప్ ॥

# శ్రీ అన్నపూర్ణాస్తోత్రమ్

శ్లో॥ నిత్యానందకరీ వరాభయకరీ సౌందర్య రత్నాకరీ
నిర్ధూతాఖిల ఘోరపావనకరీ ప్రత్యక్షమాహేశ్వరీ।
ప్రాలేయాచల వంశపావనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥

శ్లో॥ నానారత్న విచిత్రభూషణకరీ హేమాంబరాడంబరీ
ముక్తాహార విడంబమానవిలసద్వక్షోజ కుంభాంతరీ ।
కాశ్మీరాగరు వాసితాంగరుచిరా కాశీపురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥

శ్లో॥ యోగానందకరీ రిపుక్షయకరీ ధర్మైక నిష్ఠాకరీ
చంద్రార్కానల భాసమానలహరీ త్రైలోక్యరక్షాకరీ ।
సర్వైశ్వర్యకరీ తపఃఫలకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥

శ్లో॥ కైలాసాచల కందరాలయకరీ గౌరీహ్యుమాశాంకరీ
కౌమారీ నిగమార్థగోచరకరీ హ్యోంకార బీజాక్షరీ ।
మోక్షద్వారకవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥

శ్లో॥ దృశ్యాదృశ్యవిభూతి పావనకరీ బ్రహ్మాండభాండోదరీ
లీలానాటకసూత్రఖేలనకరీ విజ్ఞానదీపాంకురీ ।
శ్రీవిశ్వేశమనఃప్రమోదనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥

శ్లో॥ అన్నపూర్ణే సదాపూర్ణే శంకరప్రాణవల్లభే ।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం భిక్షాందేహి చ పార్వతి ॥

శ్లో॥ మాతా చ పార్వతీదేవీ పితాదేవో మహేశ్వరః
బాంధవాః శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥

[ఇతి శ్రీ మచ్ఛంకరాచార్య విరచితమ్]

# శ్రీగంగాష్టకము

[శ్రీ శంకరాచార్య విరచితమ్]

1. భగవతి! తవ తీరే నీరమాత్రాశనోఽహం
విగత విషయతృష్ణః కృష్ణ మారాధయామి,
సకలకలుషభంగే! స్వర్గ సోపానసంగే:
తరళతరతరంగే! దేవి! గంగే! ప్రసీద.

2. భగవతి ! భవలీలామౌళిమాలే ! తవాంభః
కణ మణుపరిమాణం ప్రాణినో యే స్పృశంతి
అమరనగరనారీచామరగ్రాహిణీనాం
విగత కలికలం కాతంకమంకే లుఠంతి.

3. బ్రహ్మాండం ఖండయంతీ హరశిరసి జటావల్లి
ముల్లాసయంతీ
స్వర్లోకా దాపతంతీ కనకగిరిగుహాగండశైలాత్ స్ఖలంతీ,
క్షోణీపృష్ఠే లుఠంతీ దురితచయచమూర్నిర్భరం
భర్త్సయంతీ
పాథోధిం పూరయంతీ ! సురనగర సరిత్పావనీ నః
పునాతు.

4. మజ్జన్మాతంగకుంభచ్యుతమదమదిరామోదమత్తాలిజాలం
స్నానైః సిద్ధాంగనానాం కుచయుగవిగలత్కుంకుమా
సంగపింగమ్,
పాయంప్రాత ర్మునీనాం కుశకుసుమచయై శ్ఛన్న
తీరస్థనీరం

పాయాన్నో గాంగ మంభః కరికలభకరాక్రాంతరం
హస్తరంగమ్.

౫. ఆదావాదిపితామహస్య నియమవ్యాపారపాత్రే జలం
పశ్చాత్పన్నగశాయినో భగవతః పాదోదకం పావనమ్,
భూయః శంభుజటావిభూషణమణిర్జహ్నోర్మహర్షే రియం
కన్యా కల్మషనాశినీ భగవతీ భాగీరథీ దృశ్యతే.

౬. శైలేంద్రా దవతారిణీ నిజజలే మజ్జజ్జనోత్తారిణీ
పారావారవిహారిణీ భవభయశ్రేణీసముత్సారిణీ,
శేషాహే రనుకారిణీ హరశిరోవల్లిదళాకారిణీ
కాశీప్రాంతవిహారిణీ విజయతే గంగా మనోహారిణీ

7. కుతో వీచి ర్వీచిస్తవ యది గతా లోచనపథం
త్వ మాపీతా పీతాంబరపురనివాసం వితరసి,
త్వదుత్సంగే గంగే! పతతి యది కాయ స్తనుభృతాం
తదా మాతః! శాతక్రతవపదలాభో ఒప్యతిలఘుః.

8. గంగే! త్రైలోక్య సారే! సకలసురధూధౌత
విస్తీర్ణతోయే
పూర్ణబ్రహ్మస్వరూపే! హరిచరణరజోహారిణి!
స్వర్గమార్గే,
ప్రాయశ్చిత్తం యది స్యాత్తవ జలకణికా బ్రహ్మ
హత్యాదిపాపే
కస్త్వాం స్తోతుం సమర్థ స్త్రిజగదఘహరే దేవి!
గంగే! ప్రసీద.

9. మాతర్జాహ్నవి ! శంభుసంగవలితే ! మౌలా నిధా
యాంజల
త్త్వత్తీరే వపుషోఽవసానసమయే నారాయణాంఘ్రి
ద్వయం,
సానందం స్మరతో భవిష్యతి మమ ప్రాణ
ప్రయాణోత్సవే
భూయా ద్భక్తి రవిచ్యుతా హరిహరాద్వైతాత్మికా శాశ్వతీ.

10 గంగాష్టకమిదం పుణ్యం యః పఠేత్ప్రయతో నరః
సర్వపాపవినిర్ముక్తో విష్ణులోకం సగచ్ఛతి.

# భారత మాతృ స్తవః

శ్లో॥ శ్రీ చక్రాంకిత విశ్వదివ్యనగిరీ సింహాసనా ధ్యాసినీం,
అంకే లాలిత రామకృష్ణ చరితాం,
బౌద్ధైర్జైనై ర్మండితాం, ।
ఆచార్యై ప్రవరైశ్చ, నానక దయానందాదిభి
ర్వందితాం,
వందే భారతమాతరం, సురవరాం, వాత్సల్య
పూర్ణాం, ధరామ్ ॥

శ్లో॥ ప్రాలేయాద్రియశస్సుధా ధవళితోదిచీదిశా భూషితాం
గంగా, హైంచవ, సింధు వార్ధిలహరీ గుంజద్గుణాశా
త్రయీం ।

హూంగిశ్యాం, మలయా చలానిలచలన్మాధ్వీసుమా
లంకృతాం
వందే భారతమాతరం, సురవరాం, వాత్సల్యపూర్ణాం
ధరామ్ ॥

శ్లో॥ ఉర్వీహీరక తారహారతరళాం, స్వర్వారి పర్వాఽమలాం
సస్యశ్యామల సుందరాం, ఫలభరాం, సర్వార్థ
సంసాధికామ్।
సత్యజ్ఞాన పరాక్రమైక నిలయాం, స్వర్గాఽపవర్గాస్పదాం
వందే భారతమాతరం, సురవరాం, వాత్సల్య పూర్ణాం,
ధరామ్ ॥

శ్లో॥ త్వాం దుర్గాం దశశస్త్రధారణకరాం, త్వామేవలక్ష్మీం,
వరాం
బ్రాహ్మీం, త్వాం, నిగమాగమాంచిత పథప్రస్థాన
విస్తారితాం
త్రింశత్కోటి సురేశ్వరైక పదవీ తీర్థాలయాలంకృతా
వందే భారతమాతరం, సురవరాం, వాత్సల్యపూర్ణాం,
ధరామ్ ॥

శ్లో॥ జ్యోత్స్నాశుభ్ర వితాన దీప్తవిపినే, దీవ్యత్సురే,
కందరే,
మృత్స్నామోద సుగంధ బంధుర తనూ
రాజత్ప్రిజా రంజితాం

హిందూ జీవన తత్వభావన, కళా, సాహిత్య
సంపద్యుతాం
వందే భారతమాతరం, సురవరాం, వాత్సల్యపూర్ణాం,
ధరామ్ ॥

శ్లో॥ ద్వారే, శ్రీహరిపాదవారి ముఖరే ధౌతాలయాధిష్ఠితాం,
కన్యా పాదశిలావిలోల లహరీ గాయద్వివేకోదయాం ।
కాషాయాంబరచుంబితాంబర యశః కాదంబినీ కేతనాం,
వందే భారతమాతరం, సురవరాం, వాత్సల్యపూర్ణాం
ధరామ్ ॥

శ్లో॥ శ్రీ మద్విశ్వగురుత్వసత్వపదవీ విభ్రాజితాం, విశ్రుతాం,
ఆర్యంకర్తు మశేషవిశ్వ మనిశం, కార్యం
కరే కల్పితాం ।
సర్వేషాం శరణాగతార్తి హరణాం, సర్వారి గర్వాపహాం
వందే భారతమాతరం, సురవరాం, వాత్సల్యపూర్ణాం
ధరామ్ ॥

శ్లో॥ విశ్వైకజేయ బలౌఘసాధన రతాం సౌశీల్యసంపూజితాం
శ్రేయోదాయక మోక్షసాధకఫలే వీరవ్రతే సంస్థితాం ।
స్వేచ్ఛాస్వీకృత కార్యసాధకమతిం, సద్ధర్మహృద్దీపితాం,
వందే భారతమాతరం, సురవరాం, వాత్సల్యపూర్ణాం,
ధరామ్ ॥

శ్లో॥ అష్టకం, భారతీధాత్ర్యాః నిత్యం భక్త్యా పఠన్తియే
శ్రద్ధాచరణేతేషాం బుద్ధిస్సిద్ధిశ్చ జాయతే ॥

# మహోత్తర భావనలు

ఏకత

(ఒక దేవదేవుని పలువురు పలు నామములతో ఆరాధింతురు. ఎవరే పేరున ఆరాధించినను అది ఆ దేవదేవునికే చెందునని ప్రకటించుట హిందూధర్మ వైశిష్ట్యము)

శ్లో॥ యం శైవాః సముపాసతే శివ ఇతి -
బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధాః బుద్ధ ఇతి ప్రమాణపటవః-కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః-కర్మేతి మీమాంసకాః
సోయం నో విదధాతు వాంఛితఫలం-
త్రైలోక్యనాథో హరిః॥

శ్లో॥ త్రయీ సాంఖ్యం యోగం-పశుపతిమతం వైష్ణవ మితి
ప్రభిన్నే ప్రస్థానే పర మిద మదః-పథ్య మితి చ
రుచీనాం వైచిత్ర్యాత్ - ఋజుకుటిలనానాపథజుషాం
నృణా మేకో గమ్యః-త్వ మసి పయసా మర్ణవ మివ

శ్లో॥ ఆకాశా త్పతితం తోయం – యథా గచ్ఛతి సాగరం
సర్వదేవనమస్కారః - కేశవం ప్రతిగచ్ఛతి ॥

శ్లో॥ కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం
కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో! మే॥

శ్లో॥ శైవా వయం న ఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీజపపరా నితరాం తథాపి
చేతో మదీయ మతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరం ॥

ధర్మము

ఏది ధర్మము ?

శ్లో॥ ధారణా ద్ధర్మ మిత్యాహుః - ధర్మో ధారయతే ప్రజాః
యత్స్యాద్ధారణసంయుక్తం । స ధర్మ ఇతి నిశ్చయః॥

శ్లో॥ న తత్పరస్య సందధ్యాత్ । ప్రతికూలం య దాత్మనః
ఏష సంక్షేపతో ధర్మః - కామా దన్యః ప్రవర్తతే॥

సనాతన ధర్మ లక్షణము లేవి ?

శ్లో॥ సత్యం దమః తప శ్శౌచం - సంతోషో హ్రీః క్షమార్జవమ్
జ్ఞానం శమో దయా ధ్యానం - ఏష ధర్మ స్సనాతనః॥

ధర్మము వలన లభించున దేమి ?

శ్లో॥ ధర్మా దర్థః ప్రభవతే - ధర్మా త్ప్రభవతే సుఖం
ధర్మేణ లభతే సర్వం - ధర్మసార మిదం జగత్॥

ధర్మము నేల త్యజించరాదు ?

శ్లో॥ ధర్మ ఏవ హతో హన్తి - ధర్మో రక్షతి రక్షితః
తస్మా ద్ధర్మో న హంతవ్యో - మా నో ధర్మోహతోవధీత్ ॥

ఏల ధర్మపరుడవు కావాలి ?

శ్లో॥ సుఖార్థాః సర్వభూతానాం - మతాః సర్వప్రవృత్తయః
సుఖం చ న వినా ధర్మం - తస్మాద్ధర్మపరో భవేత్॥

ఏ వయసున ధర్మపరులం కావాలి ?

శ్లో॥ యువైవ ధర్మశీల స్స్యాత్-అనిత్యం ఖలు జీవితమ్
కోహి జానాతి కస్యాద్య - మృత్యుకాలో భవిష్యతి॥

దానం

'ఉపార్జితానాం విత్తానాం త్యాగ ఏవ హి రక్షణం' - సంపాదించిన విత్తమునకు త్యాగ మొక్కటియే రక్షణమని హిందూత్వ ప్రబోధము. దైవ ధర్మ కార్యములకు, దీన దుఃఖితుల సేవకొరకు దానము కర్తవ్యము. అంతేకాదు. హిందూసమాజ పునరుద్ధరణకు, హిందూధర్మ ప్రచారమునకు ఎల్లరు దానము చేయుచుండుట కర్తవ్యము

శ్లో॥ పిబంతి నద్యః స్వయ మేవ నాంభః
ఖాదంతి న స్వాదుఫలాని వృక్షాః
పయోధరా స్సస్య మద న్తి నైవ
పరోపకారాయ సతాం విభూతయః ॥

శ్లో॥ హస్తస్య భూషణం దానం-సత్యం కంఠస్య భూషణం
శ్రోతస్య భూషణం శాస్త్రం - భూషణైః కిం ప్రయోజనం ॥

శ్లో॥ ధర్మో జీవదయాతుల్యో - న క్వాపి జగతీరతే
తస్మాత్సర్వప్రయత్నేన - కార్యా జీవదయా నృభిః ॥

శ్లో॥ తపః పరం కృతయుగే - త్రేతాయాం జ్ఞాన ముచ్యతే
ద్వాపరే యజ్ఞ మిత్యాహు - ర్దాన మేవ కలౌ యుగే ॥

శ్లో॥ యస్మిన్ జీవతి జీవంతి - బహవ స్సతు జీవతు
కాకోఽపి కిం న కురుతే - చంచ్వా స్వోదరపూరణం॥

శ్లో॥ అదాన దోషేణ భవే ద్దరిద్రః - దరిద్ర దోషేణ
కరోతి పాపం

పాపా దవశ్యం నరకం ప్రయాతి -
పునర్దరిద్రో పునరేవ పాపీ॥

# సామాజిక జీవనం

(సామాజిక జీవనమున స్పృశ్యా స్పృశ్యవిభేదము తగదని హిందూత్వ సందేశము.)

సంగచ్ఛధ్వం సంవదధ్వం-సంవోమనాంసి జానతామ్
దేవాభాగం యథాపూర్వే-సంజానానా ఉపాసతే.
సమానో మంత్రః సమితిస్సమానీ, సమానంమనః
సహచిత్తమేషామ్
సమానం మంత్రమభి మంత్రయేవః, సమానేన
వోహవిషాజుహోమి

సమానీవ ఆ కూతిః-సమానీ హృదయానివః
సమానమస్తు వోమనో-యథావః నుసహాసతి
మాభ్రాతా భ్రాతరం ద్విక్షన్-మాస్వసార ముతస్వసా
సమ్యంచ సవ్రతా భూత్వా-వాచం వదతభద్రియ॥

శ్లో॥ దేవయాత్రావివాహేషు-యజ్ఞ ప్రకరణేషు చ
ఉత్సవేషు చ సర్వేషు-స్పృష్టా స్పష్టి ర్న విద్యతే॥
శ్లో॥ ఫలే కాష్టే రథే మంచే-నౌకాయాం పశువృషయోః
తృణేషు జనసంఘాతే-స్పర్శదోషో న విద్యతే॥
శ్లో॥ విష్ణ్వాలయాంతికస్థానాం-తత్సేవార్థ ముపేయుషాం
స్పర్శః స్నాత్వాపగా స్నానాత్-అతిరిక్తతమో మతః ॥
శ్లో॥ ఉత్సవే వాసుదేవస్య-యస్స్పృశ స్పర్శశంకయా
స్వర్గస్థా పితర స్తస్య-పతంతి నరకే క్షణాత్॥

**చతురాశ్రమములు**

(బాల్యమున విద్యాభ్యాసము, బ్రహ్మచర్యము, యౌవనమున గృహస్థాశ్రమము, వార్ధక్యమున మునివృత్తి, అంత్యమున సన్యాసయోగము హిందువులు ప్రతిపాదించిన ఆదర్శ జీవనవిధి.)

శ్లో॥ శైశవేఽభ్యస్త విద్యానాం - యౌవనే విషయైషిణాం
వార్ధకే మునివృత్తీనాం-యోగేనాంత్యే తనుత్యజాం॥

**పంచ ఋణములు**

(మన జీవితములు ఐదుగురికి ఋణపడియున్నవి. ఆ ఋణములను తీర్చుకొనుటలోనే మానవ జీవితమునకు ఔన్నత్యమున్నదని హిందూ సమాజ సందేశం. పంచ యజ్ఞములు అవ్వియమిట్లు చేసికొనదగియున్నది )

దేవ ఋణం : మనకీ జీవితము ప్రసాదించిన పరమేశ్వరుని నిరంతరం స్మరించుటద్వారా మాత్రమే ఈ

ఋణము నుండి విముక్తులం కాగలము.

ఋషిఋణము : మనకు లభించిన సంస్కృతీ విజ్ఞానాదులు పూర్వఋషులు ప్రసాదించినవి. వానిని అనుసరించుచు భావితరములకు అందించుటలోనే ఈ ఋణము నుండి విముక్తి.

పితృఋణం : మనకీ తనువును వంశమును ప్రసాదించినది మన పితరులు. ఈ వంశమును వృద్ధిచేసుకొనుటయే గాక, మన సంతతి హిందూ ధర్మమునకు దూరము కాకుండా శ్రమించుటలోనే ఈ ఋణమునుండి విముక్తి.

భూతఋణం : మన జీవనయాత్రలో సాయపడు పశు, పక్షి, వృక్ష, క్రిమి కీటకాదు లెన్నిటికో మనముఋణపడి యున్నాము. వాటియెడ అహింస, దయ, వానికై ఆహారాది వితరణము ఆ ఋణమునుండి విముక్తి సాధనములు.

మనుష్యఋణం : దీనిని సమాజ ఋణం అనవచ్చు. సమాజము వల్లనే మనకు సుఖ జీవనము జరుగుచున్నది. అందువల్ల సమాజ సంక్షేమ కార్య కలాపములకై కృషిచేయుట, దీనుల, దుఃఖితుల సేవ, ఉపేక్షిత జన సేవల ద్వారా ఈ ఋణ విముక్తికి ప్రయత్నించవలెను.

## ఆరోగ్య సాధన

[మానవ జీవితమును గురించి అత్యంత శాస్త్రీయంగా ఆలోచించి ఇహ పర సుఖానందదాయకమగు సూత్రములను ప్రతిపాదించిన ఘనత మన ప్రాచీన ఋషిమున్యాదులది. ఆరోగ్యప్రదమగు జీవనమునకు సంబంధించి ఆయుర్వేదాది గ్రంథముల ద్వారా ఆ మహనీయులు చెప్పినవి కొన్ని ఇచట క్లుప్తముగా చెప్పబడుచున్నవి. స్థలాభావముచే సంస్కృత శ్లోకములు ఈయబడుటలేదు ]

1. సూర్యోదయమునకు పూర్వమే బ్రాహ్మీముహూర్తమున లేచి ప్రశాంత చిత్తముతో ప్రార్థనాదికములు చేయవలెను.

2 రాత్రి భద్రపరచిన ఎనిమిది పుడిసెళ్ళ నీటిని తెల్లవారుఝామున త్రాగిన వాతపిత్తశ్లేష్మములు హరించును. నూరేండ్లు సుఖజీవనము సాధ్యమగును.

3. (చన్నీటి) స్నానమువలన శుభ్రతయేగాక పైత్యము, దాహము మేహములు అణగుట, అగ్నిదీప్తి, ధాతువృద్ధి, తేజస్సు, దీర్ఘాయువు కలుగును. భోజనానంతరము స్నానము తగదు. తైలాభ్యంగనము సర్వాంగములకు పుష్టిని కల్గించును.

4. మనస్సును సదా నిర్మలముగా, ప్రశాంతముగా నుంచుకొనుటయు ఆరోగ్యమున కత్యంతావశ్యకము.

5. ఉభయయము ఝాములోపల జీర్ణరసములుత్పత్తియగు సమయము గాన ఆలోపున ఆహారసేవనము అనారోగ్య కరము. రెండు ఝాముల లోపల భుజింపవలెను. ఆ తర్వాత భుజించుట బలక్షయము.

6. భోజనమునకు ముందు అల్లము (శొంఠి) సైంధవ లవణము కలిపి స్వీకరించుట వలన అరుచి తొలగి, జీర్ణశక్తి వృద్ధియగును.

7. భోజనమునకు పూర్వము కాళ్ళు చేతులు కడిగి, శుభ్ర వస్త్రములను ధరించి సమతలముపై సుఖాసనమున సమ ముగా కూర్చొని వివిధ రసములుగల యాహారమును శీఘ్రముగా మితముగా సేవించవలెను. నడచుచుగాని, నిలిచిగాని. ఏమియు సేవించరాదు. (పాశ్చాత్యరీతులు ఆరోగ్యప్రదములుగావని గ్రహించనగును) ఆకలిలేనిది భుజించరాదు, విషమ భోజనము, విరుద్ధ పదార్థములు తగవు. భోజన సమయమున చర్చలు, ఉద్వేగములు, ఈర్ష్య, భయ, కోప. లోభ, దైన్యాదులుతగవు. దాని వలన ఆహారము విషతుల్య మగును. భగవంతుని స్మరించి ఆహారము స్వీకరించవలెను. భోజనానంత రము కొలది విశ్రాంతి, నడక తగునుగాని ఉద్వేగ పూరితములగు చర్యలు తగవు.

8. పథ్యాహార విహారములు సాధన చేసిన వారికి ఔషధ ముల ఆవశ్యకత సాధారణముగా నుండదు.

9. నిత్యము తగినంత శాస్త్రీయ వ్యాయామమువలన శరీర లాఘవము, పనులలో సామర్థ్యము, స్థైర్యము, కష్ట సహిష్ణుత, దోషనాశనము, అగ్నిదీప్తి - ఇత్యాదులు కలుగును.

10. రాత్రివేళ పరిమిత నిద్రఆవశ్యకము. నిద్రకుపూర్వము భగవద్ధ్యానము, ప్రశాంత మనస్కత ఆవశ్యకము.

ప్రకృతి పంచతంత్రము

1. దినమునకు రెండు భోజనములు 2. దినమంతటి లోను రెండు శేర్లు నీరు త్రాగుట. 3. ప్రతిదినము ఒకగంట వ్యాయామము. 4. ప్రతి దినము రెండు వేళల ప్రశాంత చిత్తముతో దైవధ్యానము. 5. వారమునకొక రోజు ఉపవాసము-ఆరోగ్య పంచతంత్రమని ప్రకృతి వైద్య ప్రచారకుల ప్రబోధము.మీకు చక్కని నిద్రవస్తుందా?మీ పొట్టవైశాల్యం రొమ్ము వైశాల్యాన్ని మించి ఉన్నదా? మీకు మంచి ఆకలి ఉంటున్నదా?మీరు మీ పనులను మనస్ఫూర్తిగా ఉల్లాసముతో చేయగల్గుతున్నారా?మృదుమధుర భాషణ చేయగల్గుతున్నారా? ఆత్మపరీక్షకై ఈ ప్రశ్నలను వేసుకొనవలెనని, ఇందుకు తగిన సమాధానములు రాకపోతే అలవాట్లను సరిచేసుకొనవలెనని, ఆరోగ్య పంచతంత్రమును పాటించవలెనని ప్రకృతి వైద్యుల సూచన.

# యోగ వ్యాయామము

కేవలము ఐదే ఐదు సాధారణ అభ్యాసముల ద్వారా స్త్రీ పురుషులు, బాలబాలికలు సంపూర్ణారోగ్యముతో నుండ వచ్చును. నిత్యమూ ఇవి తప్పక సాధన చేయదగినవి. అనారోగ్యమందు, ఇతర విశేష సందర్భములలో నిలుప వచ్చును: తెలిసిన వారి సలహాను పొందవచ్చును.

## శ్వాస వ్యాయామము

సుఖాసనమున కూర్చుండి మెల్లగా శ్వాస కోశముల నిండుగా గాలి పీల్చుకొని సాధ్యమయినంత సేపు నిలిపివుంచి, తర్వాత వీలున్నంత మెల్లగాపూర్తిగా గాలిని విడువవలయును. ఇట్లు నిత్యము, 5, 10 నిముషములు చేయుట శరీరమునకు, మనస్సునకు ఎంతో మేలుచేయును. మనస్సును ఇష్టదైవముపై ఏకాగ్రము చేయవలెను.

## పద్మాసనము-1

హాయిగా, నిటారుగా, ఆనందముగా కూర్చొనవలెను. సుఖముగ సహజముగ ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరుపవలెను. పద్మాసనమున కూర్చుండి దృష్టిని భృకుటివద్ద కేంద్రీకరించి యుంచుట వలన ఏకాగ్రత యలవడును. కొందరు ఇష్ట దేవతను స్మరించుటయును కలదు. పిన్నలలో విద్యాభ్యాసము నకు గాని పెద్దలలో ధ్యానమునకుగాని ఇది చాలఉపయోగపడును.

**పశ్చిమోత్తానాసనము-2**

పేరు పెద్దదైనా, చాల తేలికయగు, ప్రయోజనకర మగు ఆసనము మోకాటి వీలున్నంతవరకే నడుము వంచ వచ్చును. కాలక్రమములో మెల్లగా ఎక్కువగా వంచ వచ్చును. తొందరపడ నవసరములేదు. వెన్నెముక, నరములు, కండరములు ఎంత ప్రయోజనం పొందేవి, శరీరము మృదువుగా రబ్బరు వలె ఎట్లు స్వాధీనమగునది ఎవరికి వారు అనుభవించి తెలుసుకొనవచ్చును. వంగి యున్నప్పుడు గాలిని నిలిపి ఉంచి మరల కూర్చొనగానే పీల్చవచ్చును. ఇట్లు 20, 25 సార్లు వంగుచు లేచుచు ఈ సాధన చేయవచ్చును. దీనివల్ల ఉదర ప్రాంతము, మూత్ర పిండములు అన్ని శక్తివంతము అవుతాయి. మలబద్ధకము, అగ్నిమాంద్యము ఏమీ ఉండవు. ఉదరమునందలి పదార్థ ములు ఆవశ్యకమగు సంచలనము పొందును. పొత్తికడుపు చక్కనగును మొలలు, మధుమేహము దరిచేరవు. 'లంబెగో' అను నడుము నొప్పి వ్యాధి ఏ వయసులోనూ రాదు.

**సర్వాంగాసనము-3**

ఇది చాల గొప్ప ఆసనము. సర్వాంగాసనమను పేరునుబట్టే దీని ప్రయోజనము అర్థము కాగలదు.

శరీరమందలి గ్రంథులలో గల అతిముఖ్యమైనదగు థైరాయిడ్ గ్రంధికి ఇది సంజీవని వంటి ఆసనము రక్త ప్రసరణము నరములు, శ్వాసయంత్రాంగము, ఇతర

గ్రంథులు, మూత్రపిండములు, లివరు, స్ప్లీను మున్నగునవి అన్నియు దీనివలన అద్భుత ప్రయోజనమును పొందును. వెన్నెముక చక్కని స్థితిలో ఉండును. ఎముకలు పెనసు బారవు. నరములు బలముగా స్వాధీనమున ఉండును. జీర్ణావయవములు చక్కనగును. స్త్రీలలో గర్భకోశము దృఢతరమగును. అగ్నిమాంద్యము, మలబద్ధకము ఇత్యాదులకు అవకాశముండదు బ్రహ్మచర్యమునకు ఉపయోగకరము

మొదట వెల్లకిలా కాళ్ళు జాపి పడుకొని, తర్వాత కాళ్ళు వంచకుండా మెల్లగా రెండుకాళ్ళను జంటగా పైకి ఎత్తి, సుఖముగా సాధ్యమయినంతసేపు (అది రెండు నిమిషములుగాని, 20 నిమిషములుగాని) ఉంచి తర్వాత, మళ్ళీ కాళ్ళను వంచకుండా జంటగా దించాలి. శ్వాస సహజముగా సుఖముగా జరపాలి.

శీర్షాసనము-4

ఆసనములలో రాణివంటిది ఈఆసనము. తలపై నిలచుట ఈ ఆసన లక్షణము. వేయడం అనుకున్నంత కష్టం కాదు. నేలమీద అరచేతులలో తలనుంచి, మొదట నడుము ఎత్తి తర్వాత కాళ్ళు పైకి చాచవలెను. ఇదంతా ఎంతో మెల్లగా క్రమంగా చేయాలి. ప్రశాంతంగా ఉండాలి. పడిపోతామని భయముంటే మొదట స్నేహితుని సాయంగాని, లేదా గోడసాయంగాని పొందవచ్చును. ఏమీభయంలేదు.

మొదట 15-20 సెకన్లు అలా నిలిచి ఉండాలి. కాలక్రమంలో 15-20 నిమిషాల వరకు వెళ్ళవచ్చు.

దీని ప్రయోజనము నేమని చెప్పాలి? మెదడుకు రక్తం ప్రవహిస్తుంది. ప్రాణమే ఉత్తేజిత మవుతుంది. మెదడు బలపడుతుంది ఆలోచనాశక్తి, ఆలోచనాశుద్ధి అన్నీ పెరుగుతాయి. మతిమరుపు పోతుంది. గుండె చక్కగా పని చేస్తుంది. మెదడుతో పనిచేసేవారు, విద్యార్థులు దీని ప్రయోజనం ఎంతైనా పొందవచ్చు. రక్తశుద్ధి, నరముల శక్తి దీనివల్ల సాధ్యం. కన్ను, ముక్కు, తల మున్నగు వానికి సంబంధించిన వ్యాధులకు అవకాశంలేదు ఇక గుండె, శ్వాసకోశములు మున్నగువానికి ఎంత ప్రయోజనమో చెప్పనక్కరలేదు. చిపరకు జుట్టు నెరయుట ఊడుట వంటి వానికి సైతము ఇది నివారణే. చెప్పకొ[illegible] కొలది ఉన్నది దీని ప్రయోజనము. అయితే ఇది ఎక[illegible] సేపు, ఎక్కువ సార్లు వేయదగదు. అల్లే గుండె [illegible] నత, శ్వాసకోశ వ్యాధులున్న వారు తెలిసిన వారి స[illegible] పొంద ఆచరించాలి.

ఇవి సాధారణంగా ప్రతివారూ-గృహస్థులు కూడ-తగి మోతాదులో ఆచరించవగినవి. శరీరం ఎక్కువ అలసి పోకుండా ఆ మోతాదు యథావకాశంగా పెంచుకోవచ్చు గమనించవలసిన విషయమేమంటే ... ఈ సాధనాలు శారీరక మానసికాభివృద్ధికేగాక, మనకు తెలియకుండానే ఆధ్యా

త్మికాభివృద్ధికి కూడా ఉపయోగిస్తాయి. దీనివల్ల మనకు కలిగే శక్తి-మన నిత్యకర్మలలో కూడా - అనగా చదువు, ఉద్యోగం, పనిపాటలలో కూడా ఎంతో ఉపయోగిస్తుంది, వీనికి వ్యయములేదు. స్థలపు సమస్యలేదు. ఏ డాబా అయినా, ఏ దొడ్డి అయినా, గాలివచ్చే ఏ గది అయినాచాలు. మెత్తని కంబళి వంటిది ఉంటేచాలు. ఉదయం. సాయంత్రం ఒక అరగంట లేదా గంట సమయం చేస్తేచాలు. శీతాకాలం వర్షాకాలములలో కొంచెం ఎక్కువసేపు చేయాలి. బాల్యము నుండి ఆరంభించి వార్ధక్యం వరకు చేయవచ్చు.

ఈ సాధనలతో శరీరారోగ్య మంతయు కాపాడుకొన వచ్చునిన అతిశయోక్తి కాదు. సర్వాంగ, పశ్చిమోత్తాన, శీర్షాసనములనే మూడింటిని నేను వేలమందికి ఉపదేశించా న్నారు శ్రీస్వామి శివానందులు. పైమాదిరి తేలిక ప్రాణాయామము, పద్మాసనము. సర్వాంగాసనము, శీర్షాసనము ప్రతివారికి ఈ నాల్గు అభ్యాసాలుంటే సాధారణ వ్యాధులేమీ రావని, జాతీయారోగ్యమే బాగుపడుననిపిస్తుందని అన్నారొకసారి పరమ పూజనీయ శ్రీ గురూజీ.

## సూర్యనమస్కారములు

పై ఆసనములు వేయనివారు సూర్యనమస్కారములు ఆచరించవచ్చును. (ఒకే రోజున రెండూ చేయుట మంచిది కాదు.) భారతీయ విజ్ఞానపు ఔన్నత్యమును చాటు మహత్తర యోగవ్యాయామము సూర్యనమస్కారములు. ఇందు

రెండు భాగములు, ఒకటి; మంత్రము, రెండు పది యంశములుగల వ్యాయామయోగము. సమగ్రయోగ వ్యాయామ మిది. సూర్యాభిముఖముగా నమస్కార స్థితి యందు ఒక్కొక్క మంత్రము చొప్పున బిగ్గరగా పఠించుచు ఒక్కొక్కసారి యోగవ్యాయామము చేయవలెను.

మంత్రము చదువుట అనేక మానసిక ప్రయోజనములకు హేతువు. ఆ మంత్రము లివి :

1. ఓం హ్రాం మిత్రాయ నమః
2. ఓం హ్రీం రవయే నమః
3. ఓం హ్రూం సూర్యాయనమః
4. ఓం హ్రైం భానవే నమః
5. ఓం హ్రౌం ఖగాయ నమః
6. ఓం హ్రః పూష్ణే నమః
7. ఓం హ్రాం హిరణ్యగర్భాయ నమః
8. ఓం హ్రీం మరీచయే నమః
9. ఓం హ్రూం ఆదిత్యాయ నమః
10. ఓం హ్రైం సవిత్రే నమః
11. ఓం హ్రౌం అర్కాయ నమః
12. ఓం హ్రః భాస్కరాయ నమః
13. ఓం హ్రాం హ్రీం మిత్రరవిభ్యాం నమః
14. ఓం హ్రూం హ్రైం సూర్యభానుభ్యాం నమః

15. ఓం హ్రౌం హ్రః ఖగపూషభ్యాం నమః
16. ఓం హ్రాం హ్రీం హిరణ్యగర్భమరీచిభ్యాం నమః
17. ఓం హ్రూం హ్రైం ఆదిత్యసవితృభ్యాం నమః
18. ఓం హ్రౌం హ్రః అర్కభాస్కరభ్యాం నమః
19. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం మిత్ర రవి సూర్య
భానుభ్యో నమః
20. ఓం హ్రౌం హ్రః హ్రాం హ్రీం ఖగ పూష హిరణ్య
గర్భ మరీచిభ్యో నమః
21.. ఓం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఆదిత్య సవిత్రర్క
భాస్కరేభ్యో నమః
22. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రః ఓం హ్రాం
హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః మిత్ర రవి
సూర్యభాను ఖగ పూష హిరణ్యగర్భ మరీచాదిత్య
సవితార్క భాస్కరేభ్యో నమః॥
23. 24. పై మాదిరి (అనగా 22లో వలె)
25. ఓం సవిత్రే సూర్యనారాయణాయ నమః

ఇవి బిగ్గరగా, స్పష్టముగా సుదీర్ఘముగా. సంపూర్ణ ముగా సరిగా చదువదగిన మంత్రములు. తెలిసిన వారిచే చెప్పించుకొనుట మంచిది. ఇవి ఏవో అక్షరముల సముదాయము కాదు. అద్భుత ప్రయోజనము గల మంత్రములని అనుభవములో తేలికగా గ్రహించవచ్చును.

## మంత్ర ప్రయోజనములు

ఓం :

అనునది బిగ్గరగా బొడ్డు నుండి పూర్ణముగా ఉచ్ఛరించుట వలన కంఠనాళములు, హృదయము, ఉదరము, మెదడు మున్నగునవి అన్నియు ఉత్తేజితములగును. ఇది నాభియందున్న మణిపూరక చక్రమును ప్రకాశింపజేయును.

హ్రీం :

హృదయమునుండి వెలువడును వాయునాళము, గొంతు, గుండె, పొట్ట, మెదడులనువానికి బలమిస్తుంది. శ్వాసకోశముల పై భాగమును బలపరుస్తుంది; ఆహార నాళములోని విషక్రిములను నశింపజేస్తుంది; పరిశుద్ధరక్తమును హృదయము నుండి శరీరమంతటికి వ్యాపింపజేస్తుంది. ఉబ్బసం, క్షయ వ్యాధులను రానీయదు. హృదయస్థానమందున్న అనాహత చక్రమును ప్రకాశింపజేయును.

హ్రూం :

కంఠమునుండి వెలువడును. కంఠము, అంగిలి ముక్కు, రొమ్ము, హృదయము, జీర్ణకోశములకు పుష్టి నిచ్చును. శ్వాసకోశములందు ఆహారనాళములందు ఉండు కఫాదులను ఛేదించి బయటకు గెంటును. సమస్త కంఠ వ్యాధులకు, టాన్సిల్సు మున్నగు వాని నివారణకు మంచిది.

యౌవనము కలిగిస్తుంది. కంఠమందున్న విశుద్ధచక్రమును ప్రకాశింపజేస్తుంది.

హ్రాం :

నాభి నుండి వెలువడును. లివరు, స్ప్లీను, ఉదరము, ఆంత్రములు, పొత్తికడుపు, జననేంద్రియములు మున్నగు వానికి మంచిది. స్త్రీ లీ యక్షరము నుచ్చరించుట పొత్తి కడుపు బాధలు, ముట్టుకుట్టు నొప్పి మున్నగువాని నివారణకు చాలా ఉపయోగకరము.

హ్రైం :

మూత్ర పిండములకు పుష్టినిచ్చును. మూత్ర సంబంధమైన సమస్త వ్యాధుల నివారణకు, నపుంసకత్వము పంద్యత్వ నివారణకు ఇది చాలా ఉపయోగకరము. స్వాధి ష్ఠాన చక్రమును ప్రకాశింపచేయును.

హ్రౌం :

మూలాధారమునుండి వెలువడును. మలకోశము ఆననమును, మూత్రపిండములు మున్నగువానిని ఆరోగ్య పరచును. మలబద్ధము, మూత్రవ్యాధులనుండి కాపాడును. మూలాధారచక్రమును ప్రకాశింపజేయును. కుండలినిశక్తిని మేలుకొలుపును.

ప్రయో :

ఇది ఒక విధముగా అన్ని భాగములకు ప్రయోజన కరము. కంఠము, రొమ్ము, గుండె, ఉదరము, అంత్రములు మున్నగునవి యన్నియు దీనివలన సంచలనము నంది వానికి సంబంధించిన వ్యాధులు, గుండెదడ నీరసము మున్నగువాని నన్నింటిని నివారించును.

ఈ వివరములను గమనించినప్పుడు ఈ మంత్రముల వెనుక ఎంతెంత శాస్త్రీయవిజ్ఞానము, అవసరమున్నదో అర్థమవుతుంది. మొదట ఎవరి నుండైన చక్కని ఉచ్చారణ విధానము నెరుగుట యుక్తము. అయితే సూర్యనమస్కారము లందిది యొక అంశము మాత్రమే. నమస్కారస్థితిలో ఉండి ఒక మంత్రము నుచ్చరించి తర్వాత క్రమముగా శారీరకయోగమును చేయవలెను. (ఆరోగ్యము తప్పవగా నున్నప్పుడు). గర్భిణీస్థితిలోను, పండువృద్ధుల శారీరక వ్యాయామములను మినహాయించి ఈ మంత్రభాగమే ఆచరింతురు. కొందరు ప్రత్యేక కారణములందు ఈ మంత్రము లనే 108 సార్ల వంతున చేయుటయు కలదు సాధారణముగా ప్రతివారు పై మంత్రములను, తర్వాత ఈ క్రింది శారీరక సాధనమును యథాశక్తి ఆచరించనగును.

**సూర్యనమస్కారము :**

**అవస్థానం జానువాసం తత ఊర్ధ్వనిరీక్షణమ్ ।**

వపుస్తులితపూర్వం చ సాష్టాంగనమనం వరమ్
షష్ఠం కశేరుసంకోచం కశేరో ర్వ్యాసన స్తతః
పులయూర్ధ్వేషణాదీనాం వ్యుత్క్రమం క్రమ భవేత్
ఇత్యేతై రాసనైః కుర్యాత్ సూర్యోపాసనం నరః ॥

సూర్యనమస్కారమందలి దశస్థితులు ఈ శ్లోకము నందు వివరింపబడినవి. ఇందుకు కొద్ది భేదముతో చేయు సంప్రదాయములును లేకపోలేదు. ఈ శ్లోకము ప్రకారము జరుగు సూర్యనమస్కారము లివి :

1. అవస్థానం : సిటారుగా కాళ్ళు చేతులు కలిపి దృఢముగా నిలిచి నమస్కారయోగమునందు శ్వాసను పూరించి పొట్టను లోతుకు పోనిచ్చి, దృష్టిని నాసికాగ్రముపై నిలిపి యుంచవలెను. తర్వాత మొదట మంత్రమును పఠించి పెదిమలు కలిపి రెండవ దశకు పోవలెను. ఈ ప్రథమ దశవలన కాళ్ళు, చేతులు, వెన్ను, నడుము, ఉదరము, భుజములు, వేళ్ళు, మెడ, మెడకండరములు, నరములు. వివిధ గ్రంధులకు వ్యాయామ మగును. జీర్ణశక్తి పెరిగి మల బద్ధము నివారణమగును

ఈ స్థితియందు చేతులెత్తు సాంప్రదాయము కలదు.

2. జానునాసనము : శ్వాసను బిగించి వంగవలెను. అరచేతులు నేలకు, ముక్కు మోకాళ్ళకు తగులు వరకు

వంగవలెను. శ్వాసను వదలవలెను, మోకాళ్ళు వంచరాదు.

దీనివలన ఆంత్రములు, నడుము, తొడలు మున్నగు వానికి వ్యాయామము లభించును.

3. ఊర్ధ్వేక్షణము : ఎడమ కాలును వెనుకకు జాపి ఊర్ధ్వముఖముగా చూచుచు దృఢముగా ఉండవలెను. శ్వాసను పూరించవలెను. పాదములు, వెన్ను, కటిప్రదేశము, మెడ, కంఠమునకు దీనివలన వ్యాయామము లభించును. అట్లే లివర్, స్ప్లీన్‌లకు ప్రయోజనము కలుగును.

4. తులితవపువు : శరీరమంతయు ఒక సరళ రేఖవలె నుండి, దృష్టిని క్రిందకు దించి చేతులపై కాలి వేళ్ళపై మోపి ఉంచవలెను.

వేళ్ళు, చేతులు, మెడ, నరములు బలపడును.

5. సాష్టాంగము : అరచేతులు, ముక్కు, రొమ్ము, మోకాళ్ళు కాలి వేళ్ళు నేల నానునట్లుండవలెను. పొట్టను లోపలకు లాగి గాలిని ముక్కుతో విడువవలెను. థైరాయిడ్ గ్రంధికి, మణికట్లు, చేతులు, కాళ్ళు, కీళ్ళు మున్నగునవి అన్నియు వ్యాయామము పొందును.

6. కశేరు సంకోచనము:శరీరము విల్లువలె వెనుకకు వంచి ఊర్ధ్వముగా చూడవలెను గాలిని పీల్చవలెను. గొంతు, మెడ కందరములు, నరములు. గ్రంథులు వ్యాయామ మందును. రొమ్ము శ్వాసకోశములు విస్తరించును. క్రిములు బయల్వెడలును. ఊబ శరీరము తగ్గును. లివరు, స్ప్లీను,

ఉదరవ్యాధులు నివారణయగును. వెన్నెముక, గ్రంధులు దృఢపడును. మెదడు నరములు బలపడి మేధాశక్తి పెరుగును.

7. కశేరు వికసనము : గాలిని పూరించి ఉంచి, పాదములను పూర్తిగా ఆన్చి, మోకాళ్ళ మధ్యగా దృష్టిని సారించాలి. చేతులు కాళ్ళు చాచి ఉండాలి. శ్వాసతీయాలి. దీనివలన మణికట్లు, పాదములు, చేతులు, కంఠము, మెడ, పొట్ట, నడుము, కాళ్ళు అన్ని ప్రయోజనము పొందును. ఇది చేయుటవలన క్షయవ్యాధి భయముండదు. మేధాశక్తి, జ్ఞాపకశక్తి, ఓర్పు సహనగునవి పెరుగుతాయి.

8 ఊర్ధ్వేక్షణము : ఇది మూడవ స్థితి వంటిదే

9 జానునాసము : ఇది రెండవ స్థితి వంటిదే. గాలి విడవాలి.

10. ఉపస్థానం : మొదటి నమస్కారస్థితి వలెనే

ఈ పది స్థితులు కలిపి ఒక నమస్కారము పూర్తవుతుంది. ప్రతి నమస్కారము ఒక్కొక్క మంత్రముతో చేయవలెను.

## కొన్ని జాగ్రత్తలు

1. ఆసనములను గాని సూర్య నమస్కారములను గాని పరగడుపున మలవిసర్జనాదుల తరవాత, ప్రభాత సమయమున పరిశుభ్ర వాతావరణంలో చేయాలి.

2. శరీరశక్తికి తగు మాత్రమే చేయాలి. శ్వాసక్రియ లను సుఖముగా నిర్వహించునట్లు చేయాలి.

3. చేసిన తర్వాత కొంత విశ్రాంతి కొంచెము పాలు తీసుకొనడం మంచిది. సూర్యరశ్మి తగులుటయు మంచిది.

4. **ఆరంభమున తెలిసినవారి సాయం పొందుట** మంచిది దీని విషయమై మంచి గ్రంథముల సాయముకూడా పొందవచ్చును.

5. ఉదయము సాయంత్రము కూడా చేయుట ఉత్తమము. ప్రతిరోజు నియమిత సమయముండ వలెను.

6 స్నానము, పరిమితమైన సాత్త్విక భోజనము, అవి వాహితులైన యెడల బ్రహ్మచర్యము. వివాహితులైన నియమపూరిత గార్హస్థ్యము, ఉత్తేజకపదార్థములను, మన సులను వికృతముచేయు గ్రంథములను విసర్జించుట. ప్రతి పనిలోను కాలనియమము ఇత్యాది సాధారణ నియమములు ఆవశ్యకము. శాస్త్రీయమైన పద్ధతిలో తప్పక నియమముతో వ్యయ రహితముగా పరిపూర్ణానందము. ఆరోగ్యము, ఆయు ర్దాయము, ధ్యేయనిష్ఠ మనశ్శక్తి మున్నగు వానిని పొందు అద్భుత సాధన ఇది. ఆబాలగోపాలము ఆచరించుటకు వీలై నట్టిది.

# సాధన సమీక్ష

## మీ కెన్ని మార్కు లొస్తాయి ?

ఈ క్రింద కొన్ని ప్రశ్నలున్నాయి. అవి పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు అందరికి చెందినట్టివి. ప్రతి ప్రశ్నకు సరియైన సమాధానం "ఔ" (అవును) అనేది ప్రతి ప్రశ్నకు ప్రక్కనే సరియైన సమాధానానికి మార్కులు వేయబడ్డాయి. మీ కెన్ని మార్కులు వస్తాయో పోల్చిచూచుకోండి.

1. మీ లోకమహోన్నత ధర్మానికి, సంస్కృతికి, సమాజానికి, చెందిన హిందువునని హైందవ భావోన్నత్యంపై దేశకల్యాణం,లోకశాంతి ఆధారపడి ఉన్నాయని భావిస్తారా 2

2. మీరు ఒక చక్కని హిందువుగా మీగృహము ఒక చక్కని హిందూగృహముగా, ఈ సమాజము ఆదర్శ హిందూ సమాజముగా రూపొందించుకొనే కర్తవ్యం మీమీద ఉందని మీరు గుర్తిస్తున్నారా ? 1

3. ఈ ఐశ్వర్యాదులన్నీ ఈశ్వరీయములని మీరు విశ్వసిస్తారా? 1

4. ఈ సమాజము ఈశ్వరుని యొక్క ప్రత్యక్షరూపంగా మీరు ఆరాధిస్తారా? 1

5. సూర్యోదయమునకు పూర్వమే లేచి ప్రాతఃస్మరణముతో దినచర్యను ఆరభించే అభ్యాసము మీ కున్నదా ? 2

6. కాలకృత్యాదుల తరువాత ఆసనములు. సూర్యనమస్కారములు ఇత్యాది వ్యాయామం ఏదైనా చేస్తారా? 2

7 ఉదయమే స్నానము తిలకధారణము-ఇత్యాది అలవాట్లు మీకున్నాయా ? 1

8. ప్రతి ఉదయం కొంతసమయం ఏకాగ్రత సంపాదనకు కానేందుకు సాధన, ధ్యానము, (ఇష్టదేవతా ప్రార్థనగాని లేదా అవ్యక్త విధానముగాని) మున్నగువాటికి కొంత సమయం కేటాయిస్తుంటారా ? 2

9. సూర్యోదయవేళ, స్నానము, భోజనాదికములు, సంధ్యాదీప సమయము, నిద్రపోయేముందు, నిత్యము వృత్తి విద్యలు ఆరంభించబోయేముందు-సముచిత ప్రార్థనము చేసే అలవాటున్నదా ? 2

10. మీమీ వృత్తి, విద్య మున్నగు వానిని శ్రద్ధతో, ఏకాగ్రతతో, నియమానుసారం విజయాభిలాషతో, పట్టుదలతో చేస్తుంటారా ? 2

11. సాయంకాలాన్ని వ్యాయామం, ఇండోర్ ఆటలు, సాంఘిక కార్యకలాపాలు ఇత్యాదిగా ఉపయోగకరమైన పద్ధతుల్లో వినియోగిస్తారా ? 1

12. ప్రతిదినము పనులను ఆయా వేళలయందు, కాలనియమంతో చేసే అభ్యాసము మీకున్నదా ? 1

13. ఉన్నత జీవనానికి ఆరోగ్యప్రదమైన సుఖజీవనానికి ఉపయోగకరమగు ఆహారవిహారాదులు, స్నానము, అభ్యంగనము, వ్యాయామము, విశ్రాంతిమున్నగు విషయములకు సంబంధించిన కనీస పరిజ్ఞానం మీకున్నదా? 1

14. హిందువుల గ్రంథములు, సాహిత్యము, దేవతలు సంస్కారములు—ఇత్యాది విషయములు స్థూలముగా మీకు తెలుసునా ? 2

15. పంచాంగమును చూచుట, ఆరోగ్యమునకై అవలంభించదగు సూత్రములు-ఇత్యాది చిన్న చిన్న విషయములు మీకు తెలుసునా ? 1

16. మీ ఇంట్లో తులసి, ధ్యానమందిరం, ప్రాతఃకాలమున శుభ కామనలతో కూడిన ముగ్గులు వేయడం, మహాపురుషుల, దేవతల చిత్రములతో హిందూత్వచిహ్నములతో అలంకరించడం ఇత్యాదులున్నాయా? 2

17. దినములో ఏదేని ఒక సమయమున కుటుంబసభ్యులంతా కలిసి పూజ, భజన మున్నగు సత్కాలక్షేపములేమైనా చేస్తారా ? 1

18. దేవాలయాలకు, సాధుసత్పురుష సందర్శనానికి, తదితరములకు వెళ్తుండే అలవాటు మీ ఇంట ఉన్నదా? 1

19. హిందూ ధర్మము, సంస్కృతి, కథలు, ఆరోగ్యశాస్త్రము, యోగవ్యాయామములు ఇత్యాదులతో కూడిన

చిన్న కుటుంబ గ్రంథాలయం మీ కుటుంబ సభ్యుల ఉపయోగార్థము ఉన్నదా ?

20. ప్రతిదినము సద్గ్రంథ పఠనము. పరస్పరము కథలు మంచి విషయములు చెప్పుకొనడం-ఇత్యాది అలవాట్లు మీ ఇంట్లో ఉన్నాయా ? 1

21. హిందూసమాజస్థితిగతుల నవగాహన చేసుకొనేదృష్టితో నిత్యము దినపత్రిక చదువుతుంటారా ?

22. తల్లిగా మీ బిడ్డలను ఆదర్శ హిందూ పౌరులుగా రూపొందించే దృష్టి మీకున్నదా ? మీరు పురుషులైతే తండ్రిగా మీ బిడ్డలను హిందూత్వ సంబంధమైన విజ్ఞానాభివృద్ధికి కృషి చేస్తుంటారా ?
మీరు పిన్నలయితే పెద్దలనుండి పై మాదిరి విషయములను అడిగి తెలుసుకొంటూరా ? 2

23. మీ ఇంట జరుగు శుభకార్యములందుగాని, మీ వృత్తి, విద్యా వ్యాపారాదులలో మీకు అభివృద్ధి కలిగినప్పుడ గాని వేడుకగా జరుపు వ్యయములలో కొంతభాగం సద్గ్రంథ వితరణకు లేదా దాన ధర్మాదులకు వినియోగిస్తుంటారా ? 3

24. అవకాశమున్నప్పుడల్లా గోపూజా, గోసేవ చేయడం, మీ ఇంట్లోని బియ్యపుకడుగు, కూరచెక్కులు మున్నగునవి ఏదేని ఒక గోవుకు (ఒకవేళ గోవు మీ ఇంట

లేకపోతే) అలవాటు చేయడం-ఈ మాదిరి దృష్టి మీకున్నదా! 1

25 హైందవ సామాజిక కార్యకలాపములలో హైందవ సంఘములలో హిందూ సంఘటనా దృష్టితో మీరు పాల్గొంటూ, కొంత సమయాన్ని, కొంత శ్రమను, మీ ఆదాయంలోనుండి కొంత ధనాన్ని వానికి అర్పించి సహకరిస్తుందంటారా? 3

26. పేదలు, హరిజనులు, గిరిజనులు, శ్రామికులు మున్నగు వారిలో ధార్మిక భావనా వ్యాప్తికి, కారుణ్యాత్మక సేవలకు (విద్య, వైద్యం వగైరా) మీరేమైనా కృషి చేస్తుంటారా? 3

27. కళలు, సాహిత్యము, హరికథాగానము మున్నగువానిలో మీకున్న శక్తియుక్తులను, అభిరుచి లేదా ఆ సందర్భముగా మీరు నిర్వహించు కార్యకలాపములను సమాజ భావనా వికాసానికి వీలుగా ఉపయోగించే ఆలోచనతో ఉంటారా? 2

28. మీరు ఏపని చేసినా, ఏ ప్రచారంచేసినా, ఏ దానంచేసినా, ఏ సాంఘిక రాజకీయాదికార్యకలాపాదులలో పాల్గొన్నా ఏ వ్యక్తిని లేదా వర్గాన్ని సమర్థించినా వ్యతిరేకించినా- అన్నీ హిందూ సమాజపు సంక్షేమానికిఅనుగుణమవునో కాదో ఆలోచించి చేస్తుంటారా? 2

29. హిందూ ధర్మాన్ని, సంస్కృతిని ఏ వ్యక్తిగాని,ఏ వర్గం గాని, ఏ ప్రభుత్వంగాని నిందించినా, న్యూనపరచినా, గాయపరచినా-అట్టి వానిని నిరోధించడానికి యత్నించడం మీ కర్తవ్యం అని భావిస్తుంటారా? 2

30. వ్యక్తిగతంగానూ సామాజికంగాను మీరు ఇంకా ఇంకా ఉన్నతోన్నత హిందువులు కావడానికి హిందూత్వానికి రక్షకులుగాను, ప్రచారకులుగాను, ఆరాధకులుగాను, సేవకులుగాను, ఇంకా ఇంకా ఉన్నతోన్నతులు, కావాలనే ఆకాంక్షతో జీవన వ్యవహరణ చేస్తుంటారా? [illegible]

పై ప్రశ్నలన్నింటికి "ఆ" అనేది సరియైన సమాధానం మీకు 40 మొదలు 50 మార్కులు వస్తే మీరు స్థూలంగా ఆదర్శప్రాయముగానే జీవిత నిర్వహణ చేస్తున్నట్లు.

25 మొదలు 40 వస్తే కొద్ది శ్రమతో ఆదర్శప్రాయులు కాగలరు,

15 మొదలు 25మార్కులువస్తే విశేష శ్రమ అవసరం

0-15 మార్కులు వస్తే విప్లవాత్మకమైన మనో నిశ్చయంతో ఆదర్శ హిందువుగా రూపొందటానికి ప్రయత్నించాలి.

వ్యక్తియొక్క శారీరక, మానసిక, బౌద్ధిక, ఆధ్యాత్మిక ప్రగతికి, సామాజికమైన ఉన్నతికి ఉపకరించు ఆత్మ పరిశీలనాత్మకమగు ప్రశ్నలివి. ఇవి ఎప్పటికప్పుడు తరచు వేసుకుంటూ నూటికి నూరు మార్కులు తెచ్చుకునే ప్రయత్నం నిరంతరం చేస్తుండటం ఒక చక్కని జీవన సాధన.

# సంఘసేవలో భానువార కర్తవ్యం

[ఒక నిర్మాణాత్మక సమాజసేవా కార్యక్రమం]

# సామూహిక ప్రార్థన

శ్లో॥ భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్షభిః యజత్రాః ।
స్థిరైరంగైః స్తుష్టుం వాగ్ంం సస్తమాభిః
వ్యసేమ దేవహితం యదాయుః ॥

శ్లో॥ యం శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో
బౌ బుద్ధ ఇతి ప్రమాణ పటవః కర్తేతి నైయాయికాః।
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోఽయం నోవిదధాతువాంఛితఫలంత్రైలోక్యనాథో
హరిః ॥

శ్లో॥ త్రయీ సాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ ।
రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిల నానా పథజుషాం
నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ ॥

శ్లో॥ సర్వేఽత్ర సుఖినస్సన్తు సర్వే సన్తు నిరామయాః ।
సర్వే భద్రాణి శ్యన్తు మా కశ్చిద్దుఃఖ భాగ్భవేత్ ॥

శ్లో॥ సహనావవతు సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినా వధీతమస్తు
**మా విద్విషావహై ఓం శాంతి శాంతి శాంతిః**

ఆదివారము (భానువారము) సూర్యోపాసనకు తగిన దినము. సెలవు. దీనిని ఉత్తమమైన విధానమున వినియోగించుటవలన మంచి పనులకు చాలాకాలము కలిసివస్తుంది. ఆ విధానమును ఎవరికివారే యోజించుకొనవచ్చును.

సామాజిక ప్రయోజనము దృష్ట్యా ఎల్లరికి ఈ క్రింది విధానము ఆచరణయోగ్యము. ఉపేక్షితజన ప్రదేశములందు నివసించు హరిజన, గిరిజన, శ్రామిక జనావళికి ధర్మప్రబోధము, ఆవశ్యక సేవల నందించువారులేక వారు నాస్తికులు, మతాంతరులు నై పోవుచున్నారు. స్వధర్మమునకు దూరమగుచున్నారు. భానువారపు సెలవును వారిసేవకై కేటాయించు యోగ్యము.

1. ఆయురారోగ్యైశ్వర్య కారకుడగు సూర్యుని ఉపాస: సూర్యనమస్కారయోగము ఇత్యాదులను వారికి నేర టకై ప్రతి ఆదివారము ఉదయమున ఆ ప్రదేశములం సమాజ సేవకులు నియమిత కార్యక్రమము యోజిం నగును. ఇంకను వివిధ ప్రార్థనాదికములు, ధ ప్రసంగములును జోడించవచ్చును. ఇట్టి నియ: కార్యక్రమము వలన ఉపేక్షిత హిందూజనులు ఆధ త్మిక చింతనకై హైందవేతరుల కార్యకలాపములం చిక్కుకొనిపోవు అవకాశముండదు

2. అజ్ఞానముచేతను, ప్రలోభమువలనను, ఆదరించువారు లేకను మతాంతరులై చింతించుచున్నవారిని ఆదరించి

వారికి ధర్మబోధచేయు కార్యక్రమములను ఆనాటికి తగినవి.

3. పవిత్రమగు భానువారమున మద్య, మాంస సేవనము వర్జనీయమని పెద్దలబోధన. ఆయా బోధనల నందించుటయేగాక శుచి, శుభ్రత, ఆరోగ్యాదివిషయ ప్రసంగముల చేయనగును. ఉపేక్షిత జన సేవకు మహిళలు సైతము ఉద్యమించ వగియున్నది. వారికి ముగ్గులు తులసిపాటలు తులసి పూజ హైందవ సాంప్రదాయానుసారం గృహాలంకరణం, నిత్య ప్రార్థనాదులనెన్నటినో బోధించవచ్చును. దీనివలన సంపర్కము పెరుగుట, వారికి సంతృప్తి యానందములు కలుగుట, వారిలో హిందూత్వభావన ప్రబలమగుట ఆదర్శప్రాయమగు హిందూసంతతి అభివృద్ధి చెందుట సాధ్యము.

4. లౌకిక జీవనమున ఎన్నో కారుణ్యాత్మక సేవలు విద్యావైద్యాది సేవలు, అనేకములు వారికి ఆవశ్యకము. ప్రత్యేక సంస్థల నేర్పరచి వానిని లభింపచేయుట, ప్రభుత్వాది వ్యవస్థల ద్వారా వారికి అందవలసినవి అందజేయునట్లు చేయుట వారిని సేవించుట కొక మార్గము. హిందూ జను లెవరును మత విద్యావైద్యాది విషయములందును హైందవవర్గముల మీదను, సంస్థల మీదను పరదేశవ్యవస్థల మీదనూ ఆధారపడరాదను స్వాభిమాన

పూర్వకమగు భావన నేడు హిందూసమాజమునకు ఆవశ్యకము. అట్టి అవసరము రాకుండా సేవాకార్యములను భానువార వ్రతముగా స్వీకరించుట ఎంతయు యోగ్యము.

## విశ్వహిందూ పరిషత్ యొక్క ఆశయాదర్శములు

1. హిందూ సమాజమును సంఘటితపరచి శక్తివంతమొనరించుటకు అవసరమగు చర్యలు తీసుకొనుట.
2. భరతఖండమందుద్భవించిన నైతికాధ్యాత్మిక హిందూ జీవన మూల్యాలను రక్షించి, పెంపొందించి, వ్యాపింపజేయుట.
3. మన దేశ మందుద్భవించిన ద్వైతాద్వైత విశిష్టాద్వైత జైన; వైష్ణవ, శిక్కు, బౌద్ధాది సమస్త వర్గములకు సంబంధించిన హిందువులలో ఐకమత్యమును పెంపొందింపజేయుట.
4. విదేశములందు నివసించుచున్న హిందూ సోదరుల ధార్మిక, సాంస్కృతిక అవసరములను తెలుసుకొని వారికవసరమగు సేవలందించుట.
5. అజ్ఞానము వలన, ప్రలోభములవలన, ఒత్తిడుల వలన మతాంతరులైన వారికి స్వధర్మమునకు సంబంధించిన జ్ఞానమును కలిగించి, ఆయా ప్రభావముల బారినుండి

వారిని కాపాడి స్వధర్మములో వారు జీవించుటకువీలగు పరిస్థితులను కల్పింపజేయుట, హిందువులయ్యూహిందూ ధర్మమునకు సంస్కృతికి సంబంధించిన ప్రబోధము లందక వెనుకబడియున్న హరిజన, గిరిజన, నిమ్న వర్గాదులనబడు వివిధ ప్రజలకును మన సంస్కృతీ ధర్మముల నందించుట.

6. మన మత ధార్మిక సంస్థలగు ఆలయములు, మఠములు మొదలగునవి అవి స్థాపింపబడిన లక్ష్యముల కనుగుణ ముగా నిర్వహింపబడుటకు, ఆవశ్యకమగునో క్రొత్తవి వెలయింపబడుటకు, హిందూసమాజము ధార్మికముగా, సాంస్కృతికముగా, ఆధ్యాత్మికముగా దృఢపడుట కవసరమగు అన్యకార్యములు జరుగుటకు అవశ్యక మయిన కృషిని జరుపుట.

7. చైతన్యశీలియైనహిందూత్వమును ప్రచార మొనరించుట అట్టి ప్రచారమునకు ప్రబోధకులను తయారుచేయుట, వివిధ సంస్థలను, గ్రంథాలయములను స్థాపించుట, నిర్వహించుట.

8. అనాథ శరణాలయములు, సంరక్షక గృహముల వంటివి నెలకొల్పుట, నిర్వహించుట.

9. యావత్తు మానవాళి క్షేమమునకు ప్రయోజనకరమగు నట్లు ప్రపంచమందలి అన్ని ప్రాంతములలోను ఆధు నిక కాలమునకు అనుగుణమగు పద్ధతిలో హిందూత్వము

యొక్క నైతిక ఆధ్యాత్మిక సిద్ధాంతములను, సాంప్రదాయములను ప్రబోధించుట, వానికి సంబంధించిన జ్ఞానమును వ్యాపింపజేయుట.

—ఇవి పరిషదాశయాదర్శములలో కొన్ని—

# ఆదర్శ జీవన చర్య

1. మానవజన్మ దుర్లభమైన మహదవకాశమని గుర్తించి మహోన్నత ఆదర్శములను ముందుంచుకొని జీవన యాత్రను సాగించుట ముఖ్యాంశము.
2. నియమ నిష్ఠలు, సమయ పాలనములతో నిత్య కార్య కలాపము లన్నిటిలోను అత్యంత శ్రద్ధతో పాల్గొను కర్మణ్యత.
3. దైవభక్తి, ధర్మనిరతి, దేశభక్తి, సమాజనిష్ఠలతో జీవితమును సార్థకము చేసుకొనుట,
4. సమాజ సర్వస్వమును పరమేశ్వరరూపముగా గుర్తించి ప్రతి పనిని సేవాభావముతోను, త్యాగనిరతితోను చేయుట.
5. ఆదాయము లన్నిటిని పరమేశ్వర ప్రసాదముగా గుర్తించి స్వీయ కనీస అవసరములకు పోను మిగిలిన దానిని సమాజ సేవకు, ధర్మ కార్యములకు దైవ సేవ లకు, దేశ సేవలకు వినియోగించు ప్రవృత్తి.